ఓమ్

శ్రీ రామలింగపరబ్రహ్మణేనమః

# శ్రీ రామలింగశతకము.



ఇయ్యది

శ్రీ విజయనగరవాస్తవ్యులగు

నూతి సూర్యనారాయణ పంతులుచే



రచియింపఁబడి

గంజాం జిల్లా నర్సన్నపేట వాస్తవ్యులును

ల్యాండు హోల్డర్లును నగు

మ॥ పోట్నూరు స్వామిబాబు గారివలన

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

గ్రంథకర్త వలన

ప్రకటింపఁబడినది.

1930.

# విజ్ఞప్తి

నేనాంగ్లపాఠశాలలోఁ జదువుచున్నకాలములో నాంధ్ర భాషయం దధికమగు నభిరుచి జనించుటంజేసి మంచి మంచి గ్రంథములఁజదువుటయు నప్పుడప్పుడు తోఁచినవస్తువులపయిఁ గవిత్వము చెప్పుటయుఁ బ్రాప్తపడియుండెను. పిమ్మట పాఠశాలనువిడిచి యుద్యోగములోఁ బ్రవేశించినది మొదలుకొని 25 సంవత్సరములు తీరుబడి లేకపోవుటవలనఁ దత్కవిత్వశక్తి యంతర్లీనమైయుండెను. ఇప్పుడు శ్రీపరమేశ్వరానుగ్రహము వలనను, శ్రీ శ్రీ శ్రీ విజయనగర సంస్థానాధీశులగు శ్రీశ్రీశ్రీ మహారాజారాజా శ్రీ శ్రీ శ్రీ పూసపాడి "అలకనారాయణ గజపతిరాజు మహారాజు మన్నెసుల్తాను బహదూరు" వారి కరుణాకటాక్షముచేతను విశ్రాంతివేతనమును బుచ్చుకొనుచుఁ గొన్నిశతకాది గ్రంథములు రచియించి యుంటిని. వానిలో "1. జానకీవిభుస్తవకదంబము, 2. శ్రీసింహాద్రినారసింహశతకము 3. శ్రీమార్తాండ శతకము, 4. ఆపత్సంహారము, 5. ఆర్తారావము, 6. శ్రీరామచంద్రచరణచామరము" అను నీగ్రంథములు పరిచరింపఁబడిభక్తులరసనాంగణములసంచరించుచున్నవి.

ఇప్పుడు నారచియించిన "శ్రీరామలింగశతకము" అను శ్లేషగల పద్యకదంబమును నీక్రిందఁ బొందుపఱచి పాఠక మహాశయులకుసమర్పించుచున్నాను. ఇందలిదోషములవిసర్జించి గుణములనే పరిగ్రహించి నాకుఁ బ్రోత్సాహమును గల్గింప వేఁడుచున్నాను.

శ్రీశ్రీశ్రీ విజయనగరము. 21—3—29. | నూతి సూర్యనారాయణ, 21-3-1929



ఓమ్

శ్రీరామలింగ పరబ్రహ్మణేనమః

# శ్రీరామలింగ శతకము

సీ॥ శ్రీపార్వతీసతీ ♦ చిత్తాబ్జమదభృంగ!,
తాపసానన మహా ♦ త్పలపతంగ!॥
సంపూర్ణశరదిందు ♦ చంద్రికాధవళాంగ!,
సంతతనివసిత ♦ శైలశృంగ!॥
ఫాలనేత్రానల ♦ భస్మీకృతానంగ!,
శ్రితలోకహిత! పాణి ♦ ధృతకురంగ!॥
మాతంగదైత్య ప్ర ♦ భూతస్మయవిభంగ!,
నుతదివ్యదేహాభూ ♦ షితభుజంగ!॥

తే॥ గీ॥ సాగరనిషంగ! భూతసం ♦ చయసుసంగ!॥
సాంద్రకరుణాంతరంగ! ర ♦ సాశతాంగ!॥
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ సకలచరాచర ♦ జంతుజాలంబులఁ,
దగసృజియించు వి ♦ ధాతవీవ।
జీవులనెల్లను ♦ జేకొనినిత్యంబుఁ,
బోషించుపద్మనా ♦ భుఁడవీవ।
కాలావసానంబుఁ ♦ గల్పించిప్రాణుల,
విలయంబునొందించు ♦ విభుఁడవీవ।
సర్వజీవులొనర్చు ♦ సకలకృత్యంబుల,
నరయుచుఁ ఫలమిచ్చు ♦ యముఁడవీవ।

తే॥ గీ॥ జననమరణాది దుఃఖముల్ ♦ సమయఁజేసి।
భక్తులకు మోక్షమొసంగు ♦ ప్రభుఁడవీవ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ భీష్మతరంబగు ♦ గ్రీష్మకాలమునఁ బం,
చాగ్ని మధ్యమునందు ♦ నధివసించి।
ప్రావృట్సమయమందుఁ ♦ బహిరంగమైన భూ,
స్థలియందుఁగోరిని ♦ శ్చలతనిల్చి।
బహుశీతువునఁగంఠ ♦ పర్యంతమునవారి,
మధ్యంబునందున ♦ మౌనకుండి।
యేకపాదాంగుష్ఠ ♦ మిలమోపి బాహువుల్,
మీఁదికి నెత్తుచు ♦ మేదినిపయిఁ।

తే॥ గీ॥ దపముగావించెదరు మునుల్ ♦ తావకీన।
పదమునాశించియునుగాదె? ♦ ప్రకటముగను।

విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!! 3.

సీ॥ శ్రీపార్వతీనాథ! ♦ నీపాదసేవల,
సతతమేనుండంగ ♦ సంతసంబు।
మనమునను ప్పొంగఁ ♦ దనివితీరఁగనీదు,
భజనసల్పఁగనుంటి ♦ భక్తిమీఱ॥
నీపై నిడోందంబు ♦ నిశ్చలంబుగనిల్వఁ,
గరుణించి నాదు హృ ♦ త్కమలమందు।
నెలకొన్నవాంఛను ♦ నెఱవుగాఁదీర్పంగ,
దీక్షవహింపుము ♦ దీర్ఘముగను।
తే॥ గీ॥ నిన్నుఁగొలిచెడిప్రాణుల ♦ నెమ్మితోడ।
మనుపబిరుదువహించెదు ♦ మౌనివంద్య!।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!! 4.

సీ॥ అమరకాండత్రియం ♦ బభ్యసింపఁగలేదు,
ఛందస్సులేవియుఁ ♦ జదువలేదు।
పంచకావ్యశ్లోక ♦ పఠనసేయఁగలేదు,
వివిధేతిహాసముల్ ♦ వినుటలేదు।
నాటకంబుల నల ♦ వాటుసేయఁగలేదు,
గ్రంథంబులెవ్వియుఁ ♦ గనుటలేదు।
సరసభాషాపరి ♦ శ్రమమొనర్పఁగలేదు,
వెలయఁబండితగోష్ఠి ♦ సలుపలేదు।

తే॥ గీ॥ ఈశ! నీపై నిభక్తి న ♦ న్నెచ్చరింపఁ।
జేయఁబూనితి నీకృతి ♦ సాయపడుము।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 5

సీ॥ ప్రమథగణంబులు ♦ భక్తినిన్ సేవింప,
జగముల నేలు ప్ర ♦ సక్తినున్న।
దుంబురునారదుల్ ♦ తంబురశ్రుతిబాడ,
నానందరసమునం ♦ దలమియున్న।
భక్తపుంగవకోటి ♦ పాయకుండగనిన్ను,
బలు తెఱఁగులఁ గొల్వ ♦ బలసియున్న!
గిరిజాదిసతులతో ♦ గేళిసల్పుచునీవు,
మోహార్ణవంబున ♦ మునిగియున్న।

తే॥ గీ॥ నాదుప్రార్థనలను మాత్ర ♦ మాదరమున।
వినుము చెప్పెద జంభారి ♦ వినుతశీల!।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 6

సీ॥ ఫాలనేత్రమువానిఁ ♦ బార్వతీభామతో,
సరససల్లాపముల్ ♦ సలుపువానిఁ।
బరమేశుఁడగువాని ♦ భక్తకామితముల,
దివిజవృక్షమువోలెఁ ♦ దీర్చువాని।
సర్వజ్ఞుఁడగువాని ♦ సకలయోగీశ్వర,
చిత్తసంచారంబు ♦ సేయువాని।

భూతేశుఁడగువానిఁ ♦ బురుహూతముఖులచేఁ,
బొలుపుగాసన్నుతుల్ ♦ పొందువాని।

తే॥ గీ॥ మనమునందున నెపుడునే ♦ మఱువకుండ।
వేదవేద్యుండవగు నిన్ను ♦ వేడ్కఁగొలుతు।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 7.

సీ॥ భువనమాతయునగు ♦ భూధరకన్యక,
వామభాగంబున ♦ వన్నెగులుకఁ।
బ్రమథాదిగణములు ♦ పాణిపల్లవముల,
ఫాలస్థలినిజేర్చి ♦ భక్తిఁగొలువ।
గంధర్వకిన్నరుల్ ♦ కవగూడియొకవంక,
గానవిద్యలవేడ్క ♦ గలుగఁజేయ।
బహుభంగులనునీదు ♦ మహిమలఁబేర్కొని,
సనకాదిమునివరుల్ ♦ సంస్తుతింప।

తే॥గీ॥ రత్నసింహాసనంబుపై ♦ రజతగిరిని।
నిండుకొలువుండు నినుదేవ! ♦ నేనుగొలుతు।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 8.

సీ॥ నీపాదభజనంబు ♦ నిర్వాణసౌధంబుఁ,
బ్రాపింపఁజేయు సో ♦ పానరాజి।
నీపావనచరిత్ర ♦ నిఖిలవిపద్ధ్వాంత,
పటలిఁదోలఁగభాను ♦ భానుచయము।

నీసమాశ్రయణంబు ♦ నిజదాససంక్లేశ,
కుధరంబులనుగూల్ప ♦ గులిశధార।
నీనామకీర్తన ♦ నిర్మలజ్ఞాన బీ,
జము మొల్కలెత్త నా ♦ సారవృష్టి।
తే॥ గీ॥ నీదుధ్యానంబు సంసార ♦ నీరరాశి।
కూలమును జేర్చిపోవంగ ♦ గొప్పనావ।
విజయనగరాభిమతరంగ ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ పదవులంగోల్పోయి ♦ వ్యర్థులైచరియించు,
దీనులంగాచెదు ♦ దీక్షతోడ।
శరణన్నవారల ♦ సంరక్షగావింప,
మోక్షలనునిల్చెదు ♦ ముదముతోడ।
స్మరియించుమాత్రనం ♦ గరుణారసంబునం,
బాపములమనిచెదు ♦ రయముతోడ।
నుతులొనర్చిననుబ్బి ♦ శ్రితులనుబోషించి,
కలుములిచ్చెదవను ♦ కంపతోడ।
తే॥ గీ॥ నినుభజింపనిదేహులు ♦ నిక్కముగను।
గలిగియుందురె? యెందేని ♦ గామదమన!।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ దారిద్ర్యపీడల ♦ దమనంబుగావించు,
వినుతచారిత్ర! యో ♦ ధనదమిత్ర!।

సంసారభయముల ♦ శమనంబుగావించు,
బోధప్రదాత! యో ♦ భువననేత!॥
పాపాత్ములనునెల్ల ♦ భస్మంబుగావించు,
త్రిజగదుద్ధరణ! యో ♦ త్రిపురహరణ!॥
దారుణవ్యాధుల ♦ దూరంబుగావించు,
భూతాధినాధ! యో ♦ మునిసనాధ!॥

తే॥ గీ॥ నీచరణదాస్యమునొసంగి ♦ నెమ్మితోడ।
నన్నురక్షింపనినుఁగొల్తు ♦ నందివాహ!॥
విజయనగరాభిమతరంగ ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 11.

సీ॥ తొలిజన్మముననిన్నుఁ ♦ దలఁచిభజింపని,
కతమున నిపుడు న ♦ న్నతులగతులఁ।
బంచేంద్రియంబులు ♦ పట్టిబాధింపనా,
యంతరరిపులు న ♦ న్నణఁచితొక్క।
జ్ఞానహీనుండనై ♦ సంసృతిబాధలఁ,
గుందుచునుంటినే ♦ గ్రిందుగాను।
నాయార్తివేగంబ ♦ పాయఁజేయఁగనిన్నుఁ,
బ్రార్థింపఁదొడఁగితి ♦ భక్తిమీఱ।

తే॥ గీ॥ నాశ్రయించినభక్తుల ♦ సరసిసుఖము।
గూర్చెదవుగాన నీప్రాపు ♦ గోరితిపుడు।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 12.

సీ॥ ఎవ్వనిమాయచే ♦ నీ విశ్వమంతయుఁ,
బుట్టుచుఁ బెరుఁగుచుఁ ♦ బొలియుచుండు।
నెవ్వనియాజ్ఞచే ♦ నీవార్థులన్నియు,
జగములముంపగఁ ♦ జాలకుండు।
నెవ్వనిమహిమచే ♦ నీమహీవలయంబు,
సంచలింపకయొక్క ♦ సరణినుండు।
నెవ్వనిశక్తిచే ♦ నీవేదశాస్త్రముల్,
మూర్తిమంతంబులై ♦ మోగిలనుండు।
తే॥ గీ॥ అట్టి నీదుప్రభావంబు ♦ నంబుజాస।
నాదులకునైనఁ బొగడంగ ♦ నలవియగునె?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 13.

సీ॥ నీయనుగ్రహమున్న ♦ నిఱుపేదకైనను,
సకలార్థములునబ్బు ♦ సరభసముగ।
నీకృపలేకున్న ♦ నిఖిలార్థవంతుండుఁ
నిరుపేదయైయుండు ♦ నిక్కువముగ।
నీవుతలంచిన ♦ నిఖిలకార్యంబులు,
క్షణమాత్రలోన సం ♦ ఘటనపడును।
నీవుతలఁపకున్న ♦ నిశ్చయించినకార్య,
సంచయంబదియెల్ల ♦ సమసిపోవు।

తే॥ గీ॥ నీదుశక్తికి సామ్యంబు ♦ లేదనంగ।
సంశయంబేమి? యో గజ ♦ చర్మధారి!॥

విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ సకలచరాచర ♦ సంఘంబులనుజొచ్చి,
సూక్ష్మరూపంబునఁ ♦ జోద్యముగను।
దిరుగుచునుండెదు ♦ దేవేశ! యింతట,
నీవుగాంచనిదెందు ♦ నిక్కువముగ।
నుండనేరదు కాదె? ♦ దండిగా నెంచంగ,
నిఖిలేశనామంబు ♦ నీకెచెల్లు।
నిన్నుమించినవేల్పు ♦ లెన్నఁగ నిజముగఁ,
గానరారెచ్చటఁ ♦ గలయఁజూడ।
తే॥ గీ॥ జగములన్నిటినేలెడి ♦ సరణియందు।
నుందువీవయ్య! వేడుక ♦ క్రిందుకొనఁగ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 15.

సీ॥ బృందారకామల ♦ పృథులసన్నుతులచే,
నాత్మనీవేవేళ ♦ నలరుచుండ।
సారంబులేని నా ♦ సంస్తుతినీకెట్లు,
ప్రీతిసల్పునటంచు ♦ వెఱవకేను।
సాహసించితినిన్ను ♦ సన్నుతిఁజేయంగ,
సమదర్శివౌటను ♦ శర్వ! నీవు।
ప్రేమతోడుతనాదు ♦ విన్నపమాలించి,
దారుణకష్టముల్ ♦ తరిమినన్ను।

తే॥ గీ॥ ధన్యునిఁగఁ జేయు మీపట్ల ♦ దయనుజూచి।
దిక్కు మఱిలేదు నీకన్న ♦ దీనరక్ష!!
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ దుగ్ధాంబునిధిఁ జేరి ♦ దుగ్ధంబులనుగోరి,
మేటిమేకంబులు ♦ మెలఁగఁ బ్రీతి।
క్షుద్రబిడాలంబు ♦ కోరికఁ దాఁగూడ,
నాక్షీరముల్ ద్రావి ♦ యలరునట్లు।
చతురోక్తులననీదు ♦ మతిని మెప్పించుచు,
నతిమోదమునుబుధు ♦ లందుచుండ।
నాఁడుఁదోఁచినభంగి ♦ నీదుకీర్తనసల్పి,
సంతసమందెడి ♦ చింతనుంటిఁ।
తే॥ గీ॥ గానవాదనునుతులంది ♦ కరుణనన్నుఁ।
జేకొనితరింపఁ జేయుము ♦ శీఘ్రముగను।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ నీనామమునుజపింప ♦ నిశ్చయంబుననుండ,
దెందంబునిలుకడ ♦ నందకుండె।
బహువిధసంసార ♦ బాధలెంతేనియు,
మల్లడిగూర్చెనా ♦ మదికి మిగుల।
కలవులేవనునట్టి ♦ కడువగలటులుండ,
దుష్టరోగంబులు ♦ తోడుపడఁగ।

సంసృతిభీతియుఁ ♦ జాలమిక్కుటమయ్యె,
వ్యాకులపాటు నా ♦ కావహిల్లె|
తే. గీ. నిట్టిదుర్దశలెల్ల నీ ♦ విడలఁజేసి|
నీదుపదభక్తినొసఁగంగ ♦ నాదుకొనుము|
విజయనగరాభిమతిరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!|| 18.

సీ. నీభక్తినొసంగి ♦ నెయ్యంబుతోనన్నుఁ,
బాలింపుమనిశంబు ♦ భక్తపోష!|
యజ్ఞానమెడఁబాపి ♦ దజ్ఞునిననుఁజేయ,
నుపలబ్ధినొసఁగుము ♦ కృపనుమేశ!|
నిన్నెఱుంగఁగఁజేసి ♦ నీయెడనామది,
పతుకంగనొనరింపు ♦ మభ్రకేశ!|
నీదురూపముఁజూపి ♦ నీతనూభవునిఁగా,
ననువేడ్కఁజూడుము ♦ నాగభూష!|
తే. గీ. నీవుసరగునఁగరుణించి ♦ నెమ్మితోడ|
నన్నుధన్యునిఁజేయుమా ♦ పన్నరక్ష!|
విజయనగరాభిమతిరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ శ్రీ ♦ రామలింగ!|| 19.

సీ. బాల్యమట్లుగడచెఁ ♦ బ్రాజ్ఞతలేకుండ,
నాకైనిజన్యానం ♦ బంకురింపఁ|
గన్నుగానకవార ♦ కాంతలఁగూడి నే.
వ్యర్థపుచ్చితిఁ బెక్కు ♦ వత్సరములఁ|

కౌమారదశయందు ♦ గర్వినై మెలఁగితి,
వార్ధక్యదశనాకు ♦ వచ్చెనిపుడు।
నినుసంస్మరింపంగ ♦ నిలువదుమనసేమి,
యోపికలేమి నా ♦ కుద్భవిల్లెఁ।
తే॥ గీ॥ గాలమంతయువమ్ముగాఁ ♦ గడపితెనుచు।
నన్నువీడక పాలింపు ♦ చెన్నుమీఱ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 2

సీ॥ కలుషహారివియన్న ♦ ఘనమైన యొకవార్త,
నుతులనుబ్బుదువన్న ♦ యొక్కయుబుసు।
నినుఁగూర్చివినియుండి ♦ నీచాత్మునై నను,
గాచెదవీవంచు ♦ గర్వినగుచు।
నఘములెన్నేనియు ♦ నలరి, యోఁగావించి,
వానినెల్లనిపుడు ♦ పాయఁగోరి।
నీవుసంతసమంద ♦ నిన్నొక్కపరివేడ్కఁ,
బ్రస్తుతించెదనన్య ♦ భావముడిగి।
తే॥ గీ॥ యిలనునీకీర్తి నిలుపుకో ♦ దలఁచితేని।
రమ్మువేవేగ ననురక్ష ♦ ణమ్ముసేయ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥

సీ॥ నెపమునకైన నే ♦ జపమొనర్పఁగలేదు,
పుణ్యతీర్థంబుల ♦ మునుఁగలేదు।

దానధర్మంబులే ♦ మేనిసల్పఁగలేదు,
సద్వ్రతంబుల నెవ్వి ♦ జరుపలేదు।
దైవతంబుల నేని ♦ దర్శింపఁగాలేదు,
పెద్దలసేవ గా ♦ వింపలేదు।
పరులకునుపకార ♦ మొకఁగిచేయఁగలేదు,
పరదారగమనంబుఁ ♦ బాయలేదు।
తే॥ గీ॥ ఇట్టిదోషినియగు నన్ను ♦ నెట్టులేని।
గరుణఁగాచిననీకీర్తి ♦ కడువెలుంగు।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 22.

సీ॥ దేహధారులయందు ♦ దివ్యమౌజన్మంబు,
నరజన్మమనియును ♦ మఱియుఁబ్రిజల।
భూమిసురుండౌచుఁ ♦ బుట్టియుండుటకదు,
నుత్కృష్టమౌనంచు ♦ నోలివిబుధు।
లనుచుందురామాట ♦ కనుకూలముగఁ నేను,
ధాత్రీసురుండనై ♦ తనరుచున్న।
నీభక్తివిడుచుట ♦ నిరసుండనైయుంటిఁ,
బరువడినాజన్మ ♦ వ్యర్థమయ్యె।
తే॥ గీ॥ నిట్టిలోపంబువెసఁదీర్చ ♦ నిలనునన్ను।
నీదుదాసునిఁజేయంగ ♦ నాదుకోనుము।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 23.

సీ॥ ఆద్యంతములు లేక ♦ నఖిలజీవులయందు,
సంతతంబును సంచ ♦ రింతువనుచు।
బ్రహ్మాండవితతులు ♦ బహుళమౌనీకుక్షి,
యందున వెలుఁగంగ ♦ నుండువనుచు।
సర్వమయుండవై ♦ సర్వతత్త్వంబుల,
నెగడెడితత్త్వంబు ♦ నీవయనుచు।
నిగమంబులెంతయుఁ ♦ బొగడునీమహిమనే,
స్తుతియింపఁబూనుట ♦ మతినిజూడ।
తే॥ గీ॥ హస్తములులేని మొండితా ♦ నంబునిధిని।
నీఁదఁజూచినట్లాగదే? ♦ యిద్ధచరిత!।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 24.

సీ॥ దుష్టాత్ముఁడను నేను ♦ దురితంబు లెన్నియో,
చేసియుంటినటంచుఁ ♦ జింతఁగొనక।
నీదు షడక్షరీ ♦ నిర్మలమంత్రంబు,
నాయధీనముఁజేసి ♦ నయముమీఱ।
బాపపుంజమడంచి ♦ నీపదపద్మముల్,
ప్రాపునాకొనరించి ♦ భద్రిమొసఁగి।
పావనునన్నుఁజేసి ♦ పతితపావనుఁడవ,
న్నట్టి నీదగుబిరు ♦ దతిశయింప।
తే॥ గీ॥ నన్నుఁదరియింపఁజేయుము ♦ పన్నగాను।
నిన్నుమదిలోనమఱువక ♦ సన్నుతింతు।

విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 25.

సీ॥ ఆదికవీంద్రుల ♦ యాశయమ్ముల నెల్ల,
శ్రద్ధతోఁ దర్కించి ♦ చదివిచూడ|
వేదవేదాంగముల్ ♦ వితతవిగా మథియించి,
యాత్మనందులసార ♦ మరసి యెంచ|
స్మృతిసూత్రముల నెల్లఁ ♦ జతురతశోధించి,
కుదురుగా ఫలితంబు ♦ మదినిదలఁప|
నలపురాణంబుల ♦ నలరారుగాథల,
నిమ్ముగాఁ బరికిల ♦ నమ్మసేయ|
తే॥ గీ॥ నీవజగముల కెల్లను ♦ నిశ్చయముగ|
మూలమనుచును కనుఁగొనుఁ ♦ బూరుషుండు|
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 26.

సీ॥ పెద్దకాలమునుండి ♦ పెక్కువ్యాపారముల్,
చేతులారంగ నేఁ ♦ జేసియుంటి!
నితరులొనర్చెడి ♦ యెన్నెనికార్యముల్,
గన్గవతోడ నేఁ ♦ గాంచియుంటిఁ|
బలువురుపలికెడి ♦ వ్యర్థంపుఁబల్కుల,
వీనులతోడ నే ♦ వినియునుంటి|
సరిలేనిభోగసం ♦ చయముల నెల్ల నేఁ,
బుడమిపై వితతవిగాఁ ♦ బొందియుంటి|

తే॥ గీ॥ నివ్వఁడన్నిటవిసికి నిం • న్నేను నమ్మి।
యెదభజించెదఁగాన న • న్నేలుమంటి।
విజయనగరాభిమతరంగ! • వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ • రామలింగ!॥ 27.

సీ॥ బద్ధులగుచుబిడ్డ • లుద్ధరించెదరంచు,
ధ్రిమఁజెందిమానిసి • వసుధలోనఁ।
పాపభీతినివీడి • పరులనత్తినిఁగొట్టి,
యర్ధమార్జించి య • య్యాత్మజులను।
పెంచగానందులో • ద్వేష్యులై కొందఱా,
జనకుబాధింతురు • జంకులేక।
కర్మానుభవముకై • కలహంబుసుతులతోఁ,
దండ్రికిఁదప్పక • దాపరించు।
తే॥ గీ॥ విఱివియా బుద్ధిజింతింప • గురునకెపుడు।
శత్రులేగాని మిత్రులే? • పుత్త్రులరయ।
విజయనగరాభిమతరంగ! • వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ • రామలింగ!॥ 28.
సీ॥ కడుపునఁగనినట్టి • కసుఁగందలనుఁబెంచఁ,
దప్పినచో నది • తల్లితప్పు।
పెద్దలఁజేయనా • పిల్లలనన్నింట,
దాఁటఁజూచిననది • తండ్రితప్పు।
పెరిగిననిసువుపైఁ • బెత్తనంబువహింపఁ,
దల్లిదండ్రులకది • తగనితప్పు।

స్వప్నమందైనను ♦ జననీజనకులకు
వెతగూర్చుటదియెల్ల
తే॥ గీ॥ ఎవరెవరితప్పు లెందున్న ♦ ధవము నందు
గుదురు కొనుటదినరునకు ♦ గొప్పతప్పు!
విజయనగ రాభి మతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగో త్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 29.

సీ॥ పెంచి పెద్దగఁజేసి ♦ పెంపుగాజీవింపఁ,
దగినతోవను బెట్టు ♦ తండ్రినిలను!
సుతుఁడు దూఱఁగొనుచుఁ ♦ బ్రతుకుఁదెరవు కేమి,
ధనమియ్య లేదని ♦ కినుక ననుట!
పౌరుష మైనట్టి ♦ పల్కుగాదనియెంచి,
గడనసేయ రెవరు ♦ గలయఁజూడ!
ముంద, తండికినేడ్చి ♦ దండించు కైవడి,
పిత్రర్యంబు కైపోవ ♦ పెట్టువాని!
తే॥ గీ॥ నీచుఁడనియెంచి జను లెంతో ♦ నిరసనముగఁ!
జిత్తమునఁజూచిచెంతకుఁ ♦ జేరనియరు!
విజయనగ రాభి మతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగో త్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 30.

సీ॥ చెఱుగడను పెన్ను ♦ చెలువుగఁదాఁబుట్టి,
చెఱకుతీపినివేగఁ ♦ జెఱచునట్లు!
స్థపతిగానిసుతుఁడు ♦ జనియించియుంటను,
గలధనంబుల నెల్లఁ ♦ బలుచ పెట్టి!

తనదుతప్పులఁగప్పఁ ♦ గొనుటకుఁదలపోసి,
ప్రియసుతుఁడై సదా ♦ వ్యధలనున్న|
తండ్రిపైదోషముల్ ♦ దడయకల్లి చేసి,
యింటిపెద్దలనెల్ల ♦ హింసపెట్టె|
తే॥ గీ॥ కడకు నిజవంశకీర్తిని ♦ గడవఁజేయు|
నిరసుఁడుదయింపఁ గులమంత ♦ నీచపడదె?|
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 31.

సీ॥ మత్తుఁడైతండ్రిని ♦ ద[illegible]ంచుచుండు,
భ్రష్టుఁడైకులమునఁ ♦ గష్టపడఁడె?|
మూర్ఖుఁడైజనకుని ♦ దూషించుతనయుండు,
ప్రాణత్యాగుదకుఁదాఁ ♦ బలుచబడఁడె?|
మొండియైపితరుని ♦ దండించుకొమరుండు,
దూరుడైభువియందు ♦ దూఱుపడఁడె?|
క్రోధియైగురునిబల్ ♦ రోధించుపుత్రుండు,
దేబెయైతిండికిఁ ♦ దిక్కుబడఁడె?|
తే॥ గీ॥ ఇట్టిదుర్నయములనల్పు ♦ నట్టికొడుకు|
తుదకునీకునుగూడఁదా ♦ దోషికాఁడె?|
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 32.

సీ॥ తనకుజననమైన ♦ తనయునిఁదగఁబెంచి,
పితరుఁడంతెనతనిఁ ♦ బెద్దఁజేయు|

విద్యలఁ జెప్పించి ♦ పెండిలిగావింప,
సుతుఁ డాపయిన్ నైన ♦ సొంతముగను।
సేవింపఁజూడక ♦ చివరవఱకు జన,
కనిదూటి, పోషింప ♦ మనుటదగు నె?।
కాకంబుతన నైన ♦ కసుగందులను బెంచు,
గూఁటనుండువఱకు ♦ లోటులేక।

తే॥ గీ॥ ఒక్క లోడవినఁ బిల్లలు ♦ ఆవ్వనంగ।
నెచ్చటను నైన జీవింప ♦ నేఁగుఁగాదె?।
విజయనగరాభి మతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 33.

సీ॥ తండ్రి మందిమినంది ♦ ధనమెల్లఁగోల్పోయి,
దేవురించు చునింటఁ ♦ దిరపడంగ।
సంరక్షనతనికి ♦ జరిగింపసుతునకుఁ,
గష్టమైతోఁచినఁ ♦ గఠినమూని।
బాధలెల్లను బెట్టి ♦ పరుషోక్తులాడుచు,
మోఁదుటకేఁ జూనా ♦ ముసలివాని।
నొక్క వేళ్ళటునఁ జంప ♦ నక్కడంబగు మేలు,
గూర్చినట్టులగునా ♦ గురునకరయ।

తే॥ గీ॥ బడుగుపసలంబుకటిక చేఁ ♦ బడఁగదాని।
కష్టములఁ జెంగి నొక వేళ్ళత ♦ గడవఁబడవె?।
విజయనగరాభి మతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 34.

సీ॥ సుతులు లేకున్నచో ♦ గతులు లేవని యెంచి;
యజ్ఞానమునఁ గొంద ♦ ఱక్కజముగ।
నారాటమొందుదు ♦ రాత్మనే వేళను,
జింతింపసద్గతిఁ ♦ జెందఁ జేయఁ।
దనయులువత్తురే? ♦ దారిఁ జూపుచు ముందు,
వారు లేకున్న నా ♦ పదవి రాదె?।
కొడుకులు లేనట్టి ♦ జడదారు లెందేని,
దుర్గతిఁ బడసిరే? దోషులగుచు।
తే॥ గీ॥ సత్పథముఁ జెందఁ బుత్త్రులు ♦ సాయపడరు।
నీదు భజనంబె పుణ్యంపు ♦ నెలవుఁ జేర్చు।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ ౬౫.

సీ॥ పుత్త్రులు పెక్కండ్రు ♦ పుట్టిన సుఖమేమి,
యవివేకులై వార ♦ లవని మెలఁగ।
దజ్ఞుఁడయిన యొక్క ♦ తనయుండు చాలఁడే?,
కులమెల్లఁ గీర్తివ ♦ ర్ధిలఁగఁ జేయ।
ధరధృతరాష్ట్రుండు ♦ తానేమి సుఖియించెఁ,
బలువురు సుతులను ♦ బడసి మున్ను।
మానిమృకండుడి ♦ మ్మహి నెంతయో కీర్తిఁ,
గాంచఁడే? యొకసుతుఁ ♦ గన్నతఁడు।
తే॥ గీ॥ తల్లిదండ్రులకపకీర్తి ♦ దగుల జేయు।
కొడుకులుదయింపకున్నను ♦ గొదువ యేమి?।

విజయనగరాభి మతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!! 36.

సీ॥ ధనధాన్యు(డగువాని( ♦ దనదుపత్నియుకాక,
పిల్లలు(గూడబల్ ♦ పిదపగాను।
భావమందున(జూచి ♦ పాటింపకేమియు,
వానిసంపర్కంబు ♦ వదలనెంచి।
యెన్నని నేరంబు ♦ లెంతయు(గల్పించి,
వానిప్రఖ్యాతియు( ♦ బాయు(జేసి।
యుపశయంబునవా(డు ♦ తపియించి కృశియించి,
కడ(చునట్లుగ(జేయు( ♦ గడకునహాహా!।
తే॥ గీ॥ ధనముమూలంబుజగతికి( ♦ దథ్యముగను।
విత్తవిరహితు(డెందేని ♦ బేర్మిగనునె?।
విజయనగరాభి మతరంగ! ♦ వృషతురంగ!!
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!! 37.

సీ॥ నీదుభక్తులమంచు ♦ మేదినినెందఱో,
జనులు వర్తింతురు ♦ వినుతలీల।
వారిలో విజ్ఞాన ♦ వంతులెవ్వారలో,
గ్రహియింపసుకరంబు ♦ గాదుచూవె।
పొట్టపోషణకయి ♦ బూటకులైనిన్న,
ధ్యానించుచున్నట్లు ♦ తెక్కువారు।
భక్తులలో నెన్న( ♦ బడుటకై ప్రజచేత,
నటననీభజనంబు ♦ సడపువారు।

తే. గీ॥ నిత్యవంబగునీదాస ♦ నికరమందుఁ।
జేరరని చెప్ప నెం దేని ♦ జెల్లకున్నె?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 38.

సీ॥ పంచపది:-ఒడలభూతినిబూసి ♦ మెడనిండరుద్రాక్షు,
మాలికల్ దిగవేసి ♦ మఠముఁజేరి।
కాషాయవస్త్రముల్ ♦ కాయమందమరంగ,
శిరమెల్ల జడలతో ♦ వరలుచుండ।
జపమాలఁద్రిప్పుచుఁ ♦ దపమొనర్చునట్లు,
కుతుకె త్తకేదియో ♦ గొణఁగుకొనుచు।
"హర! మహాదేవ!" యం ♦ చందందకేకుచుఁ,
బ్రీతిమైగంజాయి ♦ పీల్చుచుండి।
యోగులమని చెప్పి ♦ రాగమున్ విడువక,
ప్రశ్నంబులను జెప్పి ♦ ప్రజలవలన।
తే॥ గీ॥ ధనమును గ్రహించు తలపున ♦ ననయముండు।
జనులనీదాసులనుటకు ♦ ననువుపడునె?।
విజయనగరాభి మతిరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 39.

సీ॥ శిరమునీటనుముంచి ♦ శివరాత్రిదినమందు,
నుదుటభూతినిబూసి ♦ కుదురుగాను।
బట్టుపంచెనుగట్టి ♦ పావలుధరియించి,
పూజోపకరణముల్ ♦ ముందునడువ।

నాశ్రితావళితోడ ♦ నాలయంబున కేగి,

పూజారినొప్పించి ♦ పూజసలుప|

"దాయఘం" మేళంబు ♦ దరిదానుగూర్చుండి,

పెద్దపంతులు భంగి ♦ వేసమూని|

తే॥ గీ॥ దంభముననుండు జనుఁడను ♦ దానసమితి|

జేరలేడని చెప్పఁగ ♦ జెల్లకున్నె?|

విజయనగరాధి మతరంగ! ♦ వృషతురంగ!|

రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 40.

సీ॥ పంచపది:-రంగుగానుసహస్ర ♦ లింగార్చనంబును,

శివరాత్రిదినమందుఁ ♦ జేయ నెంచి|

దేవళంబున కేఁగి ♦ దేహాళిచెంతను,

న్యాసాదిమంత్రముల్ ♦ నభము మ్రోయఁ|

గుత్తుకెత్తుచుఁ జెప్పి ♦ మృత్తులింగంబుల,

నర్చించుచుండంగ ♦ నంతలోనఁ|

బరిచితుల్ వచ్చిన ♦ దరినిగూర్చుండంగఁ,

గరసంజ్ఞ వారిని ♦ గౌరవించి|

జపశాంతి కేదేని ♦ సదుపాయమునుగూడఁ,

గనుసన్నఁగోరుచు ♦ గడక జెల్లఁ|

తే॥ గీ॥ జపము ముగియించి పెద్దలై ♦ సభలయందుఁ|

దిరుగుజనులెల్ల నీభక్త ♦ వరులె? తలఁప|

విజయనగరాధి మతరంగ! ♦ వృషతురంగ!|

రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 41.

సీ॥ పంచపది:-భద్రముల్ సమకూర్చ ♦ రుద్రాభిషేకంబుఁ,
జేయ నేర్తునటంచుఁ ♦ జెప్పుకొనుచు।
భాగ్యవంతులఁ జూచి ♦ వారి నామంబుల,
నర్చనాదుల సల్ప ♦ నచ్చుగాను।
టెంకాయలను దండి ♦ యంకెంబుతోఁ దెచ్చి,
వావిరినవి యెల్ల ♦ దేవళముకుఁ।
గొంపోయి వాటినే ♦ గొందినో యచ్చటఁ,
బగులఁ గొట్టి ప్రసత్తి ♦ యాకునటంచు।
జాబితా వరుసనా ♦ సామన్నులకుఁ బంచి,
జమసేసి దక్షిణ ♦ సంతసించు।

తే॥ గీ॥ జనుల నీభక్తులనుటకు ♦ ననువుపడునె?।
వీరు పాతకులని చెప్ప ♦ వెఱఁగుగలదె?।
విజయనగరాభి మతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 42.

సీ॥ పంచపది:-దర్భాసనంబుతోఁ ♦ దనరి చిత్రాసన,
క్షితినంతయుఁ గప్పి ♦ వెలయుచుండ।
నొకవంక లౌక్యులు ♦ నొకవంక వైదికుల్,
సమయంబుకై గాచి ♦ సదసు దీర్పఁ।
బూజోపకరణముల్ ♦ పొలుపుగా వంటరి,
యాసనంబు నెదుట ♦ నమరఁ జేయ।
దేవతార్చనకంతఁ ♦ దెఱపిగాఁ బీటపైఁ,
జేరి సాంకల్పంబుఁ ♦ జేయునరికి।

మనవులుపొ్సంగఁగా ♦ విని జాబులిచ్చుచుఁ,
బూజనెట్లో సొంత ♦ పుచ్చియిట్లు।
తే॥ గీ॥ తపసియైనట్లు నటియించు ♦ ధనికుఁడరయ।
నీకుభక్తుఁడనివచింప ♦ నెరవుపమునె?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 43.

సీ॥ దాసవరులమంచుఁ ♦ దగినవారినిజూచి,
తమవల్లహరికథ ♦ దప్పకొకటి।
వినుఁడు మీరనివారిఁ ♦ బెక్కుభంగుల వేఁడి,
సుతికాండ్రిఖర్చుపో ♦ సొంతమునకుఁ।
బూటబత్తెంబైనఁ ♦ బొందుపడిననొక్క,
కతఁజెప్పసభనెక్కి ♦ కంఠమెత్తి।
సదసుపల్చబడన ♦ చ్చటికంబములకైనఁ,
గట్టుకథలఁజెప్పి ♦ కట్నమంది।
తే॥ గీ॥ బూటకముఁజేసి బ్రతికెడి ♦ పురుషులెల్ల।
నెంచఁబడుదురె? నీభక్త ♦ సంచయమున।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 44.

సీ॥ సంస్కృతియెంతేని ♦ సారహీనంబని,
పరికింపఁగాలేక ♦ నరుఁడుభువిని।
బహుజనాళికిమనః ♦ పరితాపమొనరించి,
విత్తమార్జనఁజేసి ♦ వివిధగతుల।

హావణిల్లుతోడవుల ♦ నావాసతతులను,
బెల్లుగాభూస్థితి ♦ నెల్లచోట్లఁ।
గడిమినిగూర్చి తాఁ ♦ గడచుపర్యంతంబు,
మైకంబుగాంచి నీ ♦ స్మరణమఱచి।
తే॥ గీ॥ తుదకిహపరంబులకుఁజాల ♦ దూరమగును।
గాంచనర్థాతురున కెందుఁ ♦ గలదెసుఖము ?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 45.

సీ॥ పంచపది:— మాణుఁకుదిగకయున్నఁ ♦ బొదుఁపుగాసవరించి,
మోటుగుడ్డనొకటి ♦ మొలకుఁజుట్టి।
గంజికడుగులాని ♦ కడుపునింపుకొనుచుఁ,
గాలమెభ్భంగినో ♦ గడుపుకొనుచు।
వడ్డివచ్చుననుచు ♦ గుడ్డిగవ్వయు మొదల్,
కొట్లకొద్దిధనము ♦ గూడఁబెట్టి।
యేయయ్యకిచ్చెనో ♦ యేపాపియ్యకిందనో,
యీధనంబంతయు ♦ నిముడదాఁచి।
నీదుభజనసల్ప ♦ నెఱవులేకెపుడుండ,
జముఁడుపిలువనంతెఁ ♦ జనెదువేళ।
తే॥ గీ॥ నర్థమునకయి చింతించి ♦ యొఱచునరుని।
నెట్టిగతియందునీవొచి ♦ పెట్టుటగునో?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 46

సీ॥ పినబాబుకిదియుంచుఁ ♦ బెదబాబుకదియుంచుఁ,
బేర్వేర్చిధనమెంతొ ♦ బిగినినుంచ।
మరణశాశనముల ♦ గుఱిగానువ్రాయించి,
యసువులేఁగుచునున్న ♦ నాస్తికిట్లు।
రక్షణమొనరించి ♦ రంజిల్లకంతటఁ,
దలక్రిందవిత్తంబు ♦ దనయులుంచు।
వఱకుబ్రాణంబుల ♦ వదలకగాపాడి,
ధనకాంక్షనిమ్మాడ్కి ♦ ననయముండి।

తే॥ గీ॥ స్వప్నమంద్దైనసీదుసం ♦ స్మరణలేని।
నరునకీపెట్టిగతినిడ ♦ నరయుటగునొ?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 47

సీ॥ గ్రామపురోధస్సై ♦ ప్రాదేశనమ్ముల,
గ్రహియింపనుచితంబు ♦ కాదటంచు।
సత్కర్మరతుఁడని ♦ జనులుతన్నునుటకై,
“శ్రీరంగసీతు”లఁ ♦ జెప్పచూడి।
ప్రజలిచ్చుదానముల్ ♦ పరులచేఁ బట్టించి,
దానోపకరణముల్ ♦ దానెకొనుచు।
నీధ్యానమటులుండ ♦ నిఘసంబుకైనను,
దెఱపిగానకెపుడుఁ ♦ దిరుగుచుండి।
తే॥ గీ॥ విత్తమార్జింపనేవేళ ♦ వెతలనుండు।
నరుఁడుసద్గతిఁబడయుంగఁ ♦ దెరువుగనునె?।

విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 48

సీ॥ పంచపది:- అధికారమొకయింత ♦ హస్తంబునందున్న,
ధనమునార్జింపంగ ♦ దండిగాను।
దెరువులెన్నెన్నియో ♦ విఱివిగాఁగల్పించి,
కార్యాతురుల నెల్లఁ ♦ గౌశలమున।
భ్రమపెట్టియవ్వారి ♦ పనులఁజేసెదనంచుఁ,
దేఁకువలంచముల్ ♦ సేకరించి।
చేయనున్న పనుల ♦ సేఁతగాకొనరింపఁ,
గార్యార్థులెంతయుఁ ♦ గలఁతఁజెంది।
తరతరమ్ముగనేడ్వఁ ♦ దిరముగావారికి,
హానులెన్నేనియు ♦ నంటఁజేసి।
తే॥ గీ॥ తానుజేసెడియొగ్గులఁ ♦ దలఁపకుండు।
లంచగొండికిగతియెద్ది ♦ లభ్యమగునో?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 49

సీ॥ తగవులఁదీర్పంగఁ ♦ దగినట్టియుద్యోగ,
మిసుమంతచేనుండ ♦ నేపురేఁగి।
రభసంబుతోవిత్త ♦ ముభయవాదులయొద్ద,
హస్తద్వయినిలాగి ♦ యాతతముగ।
దుదకు వారలిరువు ♦ రెదగుందవెఱపున,
నలుసంతలాభంబు ♦ నష్టమెంతో।

కలుగంగవారికిఁ ♦ గొలువునఁదీర్పిచ్చి,
కలకాలమునువారు ♦ కలఁతఁజెంద|
తే॥ గీ॥ హానిగూర్చెడియుద్యోగి ♦ కంతమందు,
నాదటను నీవుగత్రిఁగూర్ప ♦ ననువుపడు నె?|
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 50

సీ॥ అర్థంబునార్జింప ♦ నాసక్తియుదయింపఁ,
జర్మవర్తకమందు ♦ శ్రద్ధగొనుచు|
గటికవాండ్రకుసొమ్ము ♦ గట్టియవ్వారిచేఁ,
బశువులఁగొనిపించి ♦ వానిఁజంప|
నియమించిచర్మసం ♦ చయములఁదెప్పించి,
యవియమ్మిలాభమ్ము ♦ నధికముగను|
గడియించిమత్తులై ♦ కలలోననైనను,
జంతుహింసనుగూర్చి ♦ చింతఁగొనక|
తే॥ గీ॥ సకలసంపత్తిఁదులఁదూఁగు ♦ జనులుభువిని|
గడకుఁదామెట్టిగతినంది ♦ కలఁగుటగునొ?|
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 51

సీ॥ దివ్వెయున్నతఱిని ♦ దేలిపోవఁగఁజేసి,
తరువాతనెంతెయో ♦ గుఱుతుతోడ|
నేవస్తువునునైన ♦ నావిరినెమకంగ,
బిఱబిఱనదియట్టె ♦ దొరకుటగునె?|

యధికారమున్నప్పు ♦ డాశ్రితసంరక్ష,
నెడఁబెట్టియావెన్కఁ ♦ గదుఁగడంగి।
దానిని జేయంగఁ ♦ దలకొన్న ఫలమేమి,
సులువుగానదిసల్ప ♦ వలనుపడునె?।
తే॥ గీ॥ తిరుణమెడలినఁగార్యముల్ ♦ బిరుసుగొనుచుఁ।
దుదకభేద్యంబులౌఁగాదె? ♦ మదినిదలఁప।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 52

సీ॥ మలమూత్రకలితమై ♦ మలయునీదేహంబు,
మంటిఁజేరుటెగాని ♦ యంటిరాదు।
బుద్బుదప్రాయమై ♦ పొలుచునీజీవిత,
మరసిచూడఁగను సు ♦ స్థిరముకాదు,
దారసుతాదులు ♦ తగురుణస్థులెకాని,
తానఁబోయినవెంటఁ ♦ దగిలిరారు।
చంచలాలతికతో ♦ సమమైనభోగముల్,
తలఁపంగభువిశాశ్వ ♦ తములుకావు।
తే॥ గీ॥ ఎంచిచూడంగనీనామ ♦ మెల్లప్రొద్దు।
సంస్మరించుటెయీజన్మ ♦ సార్థకంబు
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 53

సీ॥ వనితాజనమునందు ♦ వస్తుజాతమునందు,
వాహనంబులయందు ♦ గేహమందు।

బుత్రపౌత్రులయందు ♦ భోగభాగ్యములందు,
ధనమందునెల్ల బాం ♦ ధవులయందు।
భూషణంబులయందు ♦ వేషభాషలయందు,
హితులందుఁ బరజన ♦ స్తుతులయందు।
నొందులనొందున ♦ నేవాంఛలేకుండ,
భావమందుననీదు ♦ భజనమందె।
తే॥ గీ॥ నాదుమదినిల్పినన్ను న ♦ నారతంబు।
నీవురక్షింపఁగోరెద ♦ నిర్మలాత్మ!।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 54

సీ॥ దేవదానవకోటి ♦ తివిరిమున్దరువంగఁ,
బాలమున్నీటిని ♦ బలమెలర్ప।
హాలాహలమహాగ్ని ♦ కీలాశులెగయు వే,
నుద్భవంబయ్యెర ♦ మద్భుతముగఁ।
గడలియునుడుకంగఁ ♦ బుడమియువడఁకంగ,
భువనంబులన్నియు ♦ మూట్టడింప।
జగములరక్షింప ♦ సమకట్టినీవల,
విషభక్షణమొనర్చి ♦ వెతలమాన్చి।

తే॥ గీ॥ తహహా! విశ్వేశ! నీమహా ♦ దాశ్రయంబు।
జంతుకోటికి సంతాప ♦ శాంతికాదె?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 55

సీ॥ సీతాపహరణంబు ♦ చేనల్లశ్రీరాముఁ,
డత్యంతపరితాప ♦ మందియాత్మ।
నిశ్చలభక్తిని ♦ నిన్నుఁదాధ్యానింప,
రామచంద్రునకీవు ♦ రభసమొప్ప।
దేహిదేహవిభాగ ♦ దివ్యప్రకారంబు,
పిండముత్పన్నమౌ ♦ విధియుమఱియు।
ముక్తిమార్గంబును ♦ మున్నగుగీతార్థ,
తత్త్వంబునంతయుఁ ♦ దడయకపుడు।
తే॥ గీ॥ చెప్పిమదిశోకరహితునిఁ ♦ జేసితౌర!।
నాదుతాపంబునటుపాప ♦ నాదుకొనుము।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 56

సీ॥ దశముఖుండారాము ♦ తన్వినిగొంపోవ,
దండకాటవినున్న ♦ తెరుణమందు।
హరిసేనచేరాముఁ ♦ డరికట్టలంకను,
బంక్తిముఖునిఁజంపి ♦ వచ్చుచుండ।
బ్రహ్మహత్యాఘంబు ♦ ప్రత్యక్షమైతోఁప,
సేతువుదరిసినా ♦ శ్రీవిభుండు।
నిన్నుఁబ్రతిష్ఠించి ♦ నిర్మలాత్మనుదాను,
బాపసంచయమెల్లఁ ♦ బాపుకొనఁడె?।
తే॥ గీ॥ భళిర! బ్రాహ్మణవధజాత ♦ పాపమయ్యు।
నీదుపూజనునశియించు ♦ నిశ్చయముగ।

విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!|| 57

సీ|| మున్ను రాముఁడనెడు ♦ భూసురపుత్త్రింను,
తనతల్లి చెప్పఁగాఁ ♦ దభ్ర మొప్ప|
నిన్ను బావయనుచు ♦ నీపతినక్కఁగా,
నమ్మిమనమునందు ♦ నెమ్మితోడ|
శ్రీశైలమున కేఁగి ♦ చెలిమిని బిలువంగ,
భ్రమరాంబతోడ న ♦ బ్బాలునంటి|
వానియింటికి నేఁగి ♦ హాయనికరుణతో,
సిరులిచ్చి పెద్దఁగాఁ ♦ జేసితౌర!||
తే|| గీ|| నీదగు కటాక్షమబ్బిన ♦ నిక్కువముగఁ|
గాఱఁతయుండునె? యెందేని ♦ నరునకిలను|
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!|
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!|| 58

సీ|| ధననాయకుఁడుతన్ను ♦ దశకంఠుఁడోడింపఁ,
బదవులఁగోల్పోయి ♦ పరఁగనిన్ను|
శరణువేఁడఁగవాని ♦ సంతాపమెడలంగఁ,
జేరఁదీసితివౌర! ♦ చెలువుమీఱ|
నేస్తకానిఁగఁజేసి ♦ నిచ్చెలుఁగలుముల,
నందఁజేసితివాని ♦ హర్ష మెసఁగ|
నలకాపురినిగూడ ♦ నతికృపామతితోడ,
నిచ్చితివానికి ♦ నిచ్చెనహాహా||

తే॥ గీ॥ దేవ! నీదయఁగాంచిన ♦ దేహికెందు।
లోపములుకల్గునే? మది ♦ లోఁదలంప।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 59

సీ॥ దశకంధరుఁడుమున్ను ♦ తనదోర్బలంబున,
రజతాద్రిఁ బెకలంగ ♦ రభసమొప్ప!
బానిచేతులఁదీఁట ♦ వసుధనీవణఁపంగ,
వాఁడునీదగు ప్రభా ♦ వంబుఁ దెలిసి।
ధృతిజగంబులునిండ ♦ నతివిరావమొనర్చి,
వినుతింపఁగావాని ♦ వెతనుమాన్చి।
చంద్రహాసంబను ♦ సాధనంబతనికిఁ,
బన్నుగానొసఁగి కా ♦ పాడినాఁడ।
తే॥ గీ॥ వహాహా! యార్తినిజెంది కూర్మి ♦ రాత్మఁదైన।
నిన్నుఁబొగడిరఁగాచెదు ♦ నెయ్యమెసఁగ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 60

సీ॥ అంధకప్రముఖులౌ ♦ యాతుధానులుతొల్లి,
త్రిపురాధినాథులై ♦ కపటవృత్తి।
భూనభోంతరములఁ ♦ బోరిఁబోరివిహరింప,
గోబ్రాహ్మణాదులు ♦ క్షోభమొంద।
నిర్జరావళియంత ♦ నినువేఁడ శరణంబు,
నభయదానమొసఁగి ♦ రభసమొప్పఁ।

దిృపుర నాశముఁ జేసి ♦ దితిజాధములఁ దుృంచి,
లోకాళ్ళఁ గాచితి ♦ వీఁక నీవు।
తే॥ గీ॥ నీదుమహిమంబువర్ణింప ♦ నిన్ను వశముగ।
నాకువశమౌనె? విశ్వేశ! ♦ ప్రకటముగ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 61

సీ॥ శృతులనశ్వములుగా ♦ క్షితినిరథంబుఁగా,
గిరినిజాపంబుఁగా ♦ హరిశరముగ।
బ్రహ్మనుసూతుఁగాఁ ♦ బ్రణవమున్ గశనుగా,
నంబు రాశిని నిషం ♦ గంబుఁగాను।
గావించుకొని ఘోర ♦ కలహంబులోపలఁ,
దిృవ్పురకుండంగఁ ♦ ద్రిపురదనుజ।
వీరులఁబరిమార్చి ♦ విష్టపంబుల నెల్లఁ,
గారుణ్యమొప్పంగఁ ♦ గాచినట్టి।
తే॥ గీ॥ గగనకేశు గిరీశునిఁ ♦ గాలకంఠు।
భక్తవరదుని నిమఁగొల్తు ♦ భక్తి మీఱ।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 62

సీ॥ దానవృందలజలం ♦ ధముఁ డేఁచి ములోక,
ములఁ దొల్లి వేధించి ♦ మూర్ఖుఁడగుచుఁ।
గండ్లుగానకవాఁడు ♦ గౌరీశ! నిన్నునా,
హరిపరమేష్ఠుల ♦ దురమునందు।

నోడింపఁగాఁజూడ ♦ నొగివృద్ధభూసురా;
కారంబుఁదాలిచి ♦ కపటవృత్తి।
నానిశాచరువేగ ♦ నాలంబులోఁజంపి,
మహిమనుభువనముల్ ♦ మనిచితౌర!।
తే॥ గీ॥ లోకములయాత్రదీర్చంగ ♦ నీకుసహజ।
మరయ నినుఁజేర సౌఖ్యంబు ♦ లబ్బకున్నె?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 63

సీ॥ తారకాసురుఁడను ♦ దానవేంద్రుఁడుతొల్లి,
యింద్రాదిసురలను ♦ హింసచేయ।
భయవిషాదంబులఁ ♦ బాకారిముఖులెల్లఁ,
దల్లడిల్లుచునుండఁ ♦ దద్భయంబు।
మాన్పింపఁగానీకు ♦ మారునిసురలకు,
సేనాధిపతిఁజేసి ♦ వానిచేతఁ।
దారకాహ్వయుఁడునా ♦ దానవుఁడీల్గంగఁ,
గావించియమరులఁ ♦ గాచితీవు॥
తే॥ గీ॥ జగదుపద్రవకరులగు ♦ శత్రువులను।
సంహరించుటనీకది ♦ సహజగణము।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 64

సీ॥ మునుగజాసురుఁడేచి ♦ మూఁడులోకంబుల,
బాధింపనెంతయు ♦ బాధముగను।

వారిజాసనుఁగూడి, ♦ వాసవాద్యమరులు,
నీదురక్షణఁగోరి ♦ నిన్నుఁజేరి।
ప్రార్థింప, వారిని ♦ రక్షింపసమకట్టి,
ప్రమథులు సేవింప ♦ బయలు వెడలి।
కుటిలునగ్గజదైత్యు ♦ ఘోరరణంబున,
సేనాన్వితముగనీ ♦ క్షితినిజంపి।

తే॥ గీ॥ ఈజగంబులఁగాచితి ♦ వీవకావె?।
నిన్నుఁబొగడంగనేనెంత ♦ నిగమవంద్య!।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 65

సీ॥ గజదైత్యుఁడెలమిఁదాఁ ♦ గైలాసమునుమున్ను,
ముట్టడింపగనీవు ♦ పట్టివాని।
సైన్యాళితోఁజంపఁ ♦ జలమునశుక్రుండు,
గతజీవులను నెల్లఁ ♦ బ్రతుకఁజేయ।
మాతంగదనుజుండు ♦ మగుడనాలము సేయ,
నింగికెత్తితివాని ♦ నేర్పుమీఱ।
నిన్నుఁదెలిసివాఁడు ♦ పన్నగనుతియింప,
వరములిచ్చితివౌర! ♦ వానికప్రభు।

తే॥ గీ॥ శాత్రవుండైనశరణన్న ♦ సరభసముగఁ।
గరుణఁగాచెదవదినీకు ♦ బిరుదుకాదె?।
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 66

సీ॥ బాణాసురుఁడుతొల్లి ♦ పంతంబుతోనిన్ను,
దాసునిగై వడిఁ ♦ దలఁచితాను॥
దనయింటనినుఁగట్ట ♦ మనమునఁగినియక,
దయనేలినాఁడవ ♦ ద్దానవేంద్రు॥
గర్భమందుసనున్న ♦ యర్భకుఁడొనరించు,
చరణతాడనముసు ♦ జననియెట్లు॥
సైఁచునోయటునిన్నుఁ ♦ జలమునబాధించు,
నట్టివానియెడల ♦ నైననోర్వు॥
తే॥ గీ॥ గలిగిరక్షించుదెవుఁడవు ♦ కరుణనహహా!॥
నీకుసరివేల్పులేఁడెందు ♦ నిశ్చయముగ॥
విజయనగరాభిమతరంగ! ♦ వృషతురంగ!॥
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ♦ రామలింగ!॥ 67

సీ॥ శిజ్జువశిశుబోతు ♦ ప్రేమించినినుభక్తి,
త్రాళ్లతోఁబూజించి ♦ రక్షఁగొనఁడె?॥
యుచ్ఛిష్టమాంసంబు ♦ నొప్పగానర్పించి,
తిన్నఁడందఁడె? నీదు ♦ దివ్యపదము॥
నిన్నుఁగాభావించి ♦ నెలతుకకుచమును,
బూజించిద్విజుఁడొందు ♦ ముక్తిగనఁడె?॥
మేఁకపెంటికనుంచి ♦ మిత్తిగొంగఁగనెంచి,
యర్పించితొకగొల్ల ♦ హాయిఁబడఁడె?॥
తే॥ గీ॥ నీయెడనునిల్పుభక్తినే ♦ నెఱినెంచి॥
ప్రోచెదే వేళభక్తాళిఁ ♦ బూతచరిత!॥

విజయనగరాభిమతరంగ! ◆ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ◆ రామలింగ!॥ 68

సీ॥ అంధుఁడొకఁడుతొల్లి ◆ యన్యులుచూపింప,
దేవళంబునకేఁగి ◆ దీక్షనెపుడు।
శివలింగమునుముట్టి ◆ చెన్నుగాధ్యానించి,
పూజసల్పుచునుండ ◆ మూఢభక్తి।
గొంటులచ్చటఁజేరి ◆ కుంచమున్దాకించి,
లింగమనుచుఁజెప్ప ◆ వేగదాని।
బూజింపనాగుడ్డి ◆ పొడమితివీవందుఁ,
గుంచేశ్వరుఁడనఁ ◆ గూర్మితోడ।
తే॥ గీ॥ నహహా! యెచ్చోటఁదలఁచిన ◆ నందునీవు।
కానుపించెదుకదభక్త ◆ గణమునకును।
విజయనగరాభిమతరంగ! ◆ వృషతురంగ!।
రమ్యగంగోత్తమాంగ! శ్రీ ◆ రామలింగ!॥ 69

సీ॥ భళ్ళాణుఁడనెడు భూ ◆ వల్లభుండిలమున్ను,
శివభక్తులకుసేవఁ ◆ జేయుచుండ।
నతనిభక్తిపటిమ ◆ నంతయుఁదెలియంగ,
జంగమవేషంబు ◆ సరగఁదాల్చి।
యాతనినీవు వే ◆ శ్యాంగననడుగన,
ప్పార్థివుండాత్మీయ ◆ పత్నిననుప।
మెచ్చియానరపతి ◆ కిచ్చితిసద్గతి,
భార్యాసమేతుఁడై ◆ పడయసుఖము।